




ఓం

శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః.

శ్రీ నాసర్ మస్తాన్ వంశచంద్రయోగిపీఠస్థాపి[illegible]

శ్రీమత్ పీరు హుశేన్ బ్రహ్మం, బద్వేల్.



# సుబోధామృతము



శ్రీ ఖాదర్ మస్తాన్ స్వానుభవస్వామిగారి

పాదధూళి.

ఖాదర్ మొదీన్ షాఖాద్రిగారిచే

రచియింపబడి

దామెర్ల బాలకోటయ్యగారి

ద్రవ్యసహాయముచే

500 కాపీలు.

గుంటూరు

వాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రించడమయినది.

వెల] 1933 [రు 0—2—0.

ఓం

శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః.

# సు బో ధా మృ త ము.

## శ్రీ హుశేను బ్రంహ్మం కీర్తన-ఆది తాళము.

1. సద్గురుమూర్తి శ్రీ హుశేనుదాసు
బద్వేలివాసుని వరెవరె
సోధనజేసిన సాధనపరుని
వేదాంతులుగన సరెసరే॥

2. మాహ్మదు మతమున జన్మించిన
సమ్మత మార్గము వరె వరే
ఇమ్మహిజనులకు దెలిపిమహాన్యుడు
జన్మముదీర్చెను సరే సరే.

3. నాల్గు వేదములు ఆరు మతంబుల
గలవని బలికెను వరే వరే
అల్లా శ్రీహరి ఒకడె యనుచును
మూలము దెలిపెను సరే సరే.

4. ఆది అంత్యమునులేని పరాత్పరు
అంతటగలడని వరే వరే
వాదభేదములు వదలిచూడుమని
బోధించిన గురు సరే సరే

5 ఆది అనాదికి ఏకరూపుడై
అద్వితీయుమై వరే వరే
పదిలమాయె పరబ్రంహ్మము ఎదటనె
కదలదిదుగోమనె సరె సరే

6. ఆధారము స్వాదిష్టచక్రముల
పది అయిదావల వరే వరే
పదహారిడచిన నిజమని ద్వాదశి
పదమును తెలిపెను సరే సరే.
7 గురుడేష్వారుడను న్యాయమువదలక
మరువక దలచెను వరే వరే
పరమగురువు శ్రీ నందయోగులని
గురినిల్పిన గురు సరే సరే.

శ్రీ ఖాదర్ మస్తాన్ వలి కీర్తన ఆది తాళము.

1. శ్రీ గురు ఖాదర్ మస్తాన్ కరుణకు
పాత్రులు కావలె నరలోన
నరకము స్వర్గము పాపము పుణ్యము
బాపును పాపుల యిలలోన.
2. కామ క్రోధదుర్గుణముల నిగ్రహి
ధాముని వేసిన నరలోన
పామరి పాలించును పరలోకమున
కష్టసుఖములు కుదుర్చును యిలలోన.
3. ఏడు మెట్ల సోపాన మెక్కి గురు
స్థానముగనుడీ నరలోన
వేడుకమీరగ కోర్కెలడగును
స్థిరముగ మనసు యిలలోన
4. మూడుకాల్వలను గంగనదాటి
మూఢత్వము విడి ధరలోన
గూడినఖాదరు యీడును జన్మము
కర్మముతొలగును యిలలోన.
5. అన్నిటియందును అంటీఅంటకను
యున్నఘనుని గను ధరలోన
మింటిమంటికిని అంటిన శ్రీగురు
సాక్షాత్ విష్ణువు యిలలోన.

2. హరిఃఓం హరిఃఓం హరిఃఓం అనుటకు
హరహర మీచెవు లినవలదా
గురుగుట్టునుగని నరహరి స్మరణలు
జేసినపుణ్యము ఓనరుడా ॥అజపం అచలం॥

3. శరణు శరణు శరణు శ్రీసద్గురు
అనుటకు శిగ్గునువిడరా
పరలోకంబులో జీవులు సుఖపడు
పదపడి వేగమెగురు గనరా ॥అజపం అచలం॥

4. పొరబాటున నీవు అగ్నినిముట్టిన
కాలునుగదరా ఓనరుడా
హరియని అటువలె దలచినజన్మము
తొలగును హరిగని ఓనరుడా ॥అజపం అచలం॥

5. బారిగొర్రెవలె బ్యారనిఅరచిన
భజనదిగాదుర పామరుడ
హరి ఎదటనె గలడది ఎరిగిన
భజనందురు సుజనుల ఓనరుడా ॥అజపం అచలం॥

6. గుర్రుగుర్రుమని గురుకబెట్టుచును
హరిని మరచి నిదురించకురా
కొర్రులగాల్చును కాలయముడు
శ్రీహరిగని శీఘ్రము హరియనరా ॥అజపం అచలం॥

7. విర్రవీగుచును బర్రెగొడ్డువలె
ప్రొద్దునుబుచ్చకు సోమరుడ
కుర్రోమొర్రోయని మొరబెట్టిన
నరకముదప్పదు ఓనరుడా ॥అజపం అచలం॥

8. ఎండమావుల చందము యీప్రా
పంచము నిగ్గకురారండ
బండెడుకట్టెలలో బడవేసిన
అండఎవ్వరుర ఓముండా ॥అజపం అచలం॥

9. తకధిం తకధిం తకధిం తకతక
తకధింతాళము ఏలనురా
పకపక ముసిముసి నవ్వులుదెచ్చును
మదికుదరని భజనదినరుడా ॥అజపం అచలం॥

10. గోవిందం హరిగోవిందం హరి
గోవిందుని గనుమందమతి
నిజపదవిది నీఅంత్యమునాటికి
అడ్డముపడురా మూఢమతి ॥అజపం అచలం॥

11. తామరాకుపై నీటిబిందుఎటు నిలవదో
తనుఅటు నిలవదురా
మమకారములను మదిదుడచిన
యీపాడుజగంబు తొలగునురా ॥అజపం అచలం॥

12. సతిసుతు బంధువు లెవ్వారు నీ
సంబంధముకారని ఎరుగుమురా
మతిహీనుడ ముందెక్కడయుంటివొ
యిక్కడకొచ్చితి వదిగనరా ॥అజపం అచలం॥

13 ధన ధాన్యములని కలవరమిడచిన
ధన్యుడవగుదువు మనివినరా
తనయులు ధనమునకొరకై తన్నెద
రని విడచిన సుఖమొందెవురా॥అజపం అచలం॥

14. పూర్వపుణ్యమున కూడిన ధనమె
చాలని తృప్తిని జెందుమురా
పరిపరివిధముల ఆశలలోపడి
నలగకునాయన మొరవినరా॥అజపం అచలం॥

15. ఆయువు గెట్టిగ ఆయమువదలని
కాలము బలగము ముడిబడురా
ఆయువుతీరిన కాయము నీ ప్రియ
సతిఅంటను భయమొందునురా॥అజపం అచలం॥

16. పారెటి వ్రరవడి నీటివలెను నీ
జీవితకాలము తిరగదురా
అరలే నాశలోమునుగుచు తేలుచు
యేడ్చిన ఫలమేమున్నదిరా॥అజపం అచలం॥

17. ప్రాయము వ్యర్థముచేయక యౌవన
కాలము స్త్రీలను జూడకురా
ప్రాయము బోయిన ప్రార్థనజేయవు
ముసలివాడవైవ్యసనమురా॥అజపం అచలం॥

18. కలిమి బలము కులగర్వము జెందుచు
కన్నులుగానక తిరగకురా
జలబుద్బుదముల తనువిదనమ్మకు
జ్ఞానమునొందిన ఘనమగురా॥అజపం అచలం॥

19 పెద్దల దూషణచేయకు నే
పెద్దనుచును మదమున దిరిగకురా
యిద్దరుదూతలు ఎప్పుడు వచ్చెనె
యుందురు మన్నన జేతురురా॥అజపం అచలం॥

20 సహ సహవాసము చాలును మూర్ఖము
సమశుట సద్గతి నొందుటరా
ఇహాపరములో కలకాలము జీవుడు
సుఖము వహించును జూడుమురా॥అజపం అచలం॥

21 అజ్ఞుడైనను నీవు ద్విజుడైనను పర
రాజహంస మరుగెరుగుమురా
రాజ రాజులకు రాజైనను
ఆశిపడమెరుగని బ్రతుకేటికిరా॥అజపం అచలం॥

22 పుట్టుచు గిట్టుచు ఘననరకంబున
గూలుట యేడ్చుట ఏటికిరా
మటుమాయము యీ సంసారము
పరమేశుని అనయము వేడుమురా॥అజపం అచలం॥

23. ఐశ్వర్యముగల రోగముగల స
న్న్యాశి సాదేవడైనను రా
ఆశలేక ఎటుజూచిన దేవుని
దర్శించిన ఆనందమురా॥అజపం అచలం॥

24 సంసారిని గాపాపము తొలగున అని
సంశయములు యుంచకురా
సన్న్యాసత్వమె ముక్తి నొసంగదు
సమరసమున యిల మెలుగుమురా॥అజపం అచలం॥

25. అద్దమువంటిది పరిశుద్ధముగల
మనసును మలినము జేయకుర
బద్ధుడవై మదమాత్సరముల నీ
బుద్ధిగోలుపోవద్దుమురా ॥అజపం అచలం॥

26. స్త్రీ స్తనములు నీమనసున అనయము
వెలగలపగుసములననకురా
మాంసముద్దలవి ధీయని మదిదృఢ
పరచి అసహ్యము నొందుమురా ॥అజపం అచలం॥

27. జన్మించిన మనకొందుకు జనిముక
యుంచుక యోచన జేయుముర
తిని నిదిరించుట బిడ్డలుకనుటకు
కాదుర తను తా నెరుగుమురా ॥అజపం అచలం॥

28. నిక్కుచు నందరి నిందెలు జేయుచు
భేదభావ మదినుంచకురా
చిక్కులోబడి యిగిలించిన దక్కువు
పుట్టికి స్వర్గము కెక్కువురా ॥అజపం అచలం॥

29. పెద్దలమాటల పెడచెవు బెట్టకు
కనుగుడ్లూర్చుచు జూడకురా
సిద్ధముగ యము డెరటి కొరివి
నీగుడ్లలో పొడుచును అక్కడరా ॥అజపం అచలం॥

30. వ్రతదానంబులు గంగస్నానము
జేసిన ఏమిర పామరుడ
సత్యజ్ఞానము లేనిది రౌరవ
నర్కము ప్రాప్తము ఓనరుడా ॥అజపం అచలం॥

31. మాధవనామము వేదనదీర్చును
సాధన మేమియు లేనిదిరా
ఆధారము లేకంతటనిండిన
దదిద్వాదశి పదమందుమురా ॥అజపం అచలం॥

32. పిడికెడుఅన్నము కుక్కకుబెట్టిన
మరువదు నిను నీ యింటినిరా
ఎడతెగలేనిటి సుఖములుయిచ్చిన
దేవునికుక్క మరువకురా ॥అజపం అచలం॥

33. ఆనందంపరమానందం పర
మానందము పరమాత్మనరా
జ్ఞానానందము నొంది అనంతము
జన్మము రహితము జేయుమురా ॥అజపం అచలం॥

34. పూర్వముజేసిన కర్మవశంబున
పాడుఘటము మనకాయెనురా
ప్రారబ్ధంబిది హరిహరధాతలు
అనుభవమొందక తీరదురా ॥అజపం అచలం॥

35. పొరబాటున యిక కర్మముచేయకు
ప్రారబ్ధంమరి విడవదురా
కర్మము సంచిత ఆగామిజ్ఞా
నంబున పడి నశియించునురా ॥అజపం అచలం॥

36. తప్పులుచేయుచు తలరాతనుచును
తప్పుడునడతలు నడవకురా
తిప్పలుతప్పవు యిప్పుడుఅప్పుడు
మొప్పెతనంబును విడువుమురా ॥అజపం అచలం॥

37. నరపశుపక్షులు క్రిమికీటకమృగ
వృక్షము భూమాకాశమురా
అరనిమిషము ఎడబాయక జేసె
భజనమగవ జయశుభమగురా ॥అజపం అచలం॥

38. అల్పసుఖముకొర కన్నగసాట్లను
పడితలపోతువు మాటికిరా
స్వల్పమనసు నీకేలర ఓరి
శంతా రాములజూడుమురా ॥అజపం అచలం॥

39. జడియకదుడుకున ఎగసిబడకునీ
పడుచుదనమున పామరుడా
మూడుదినంబుల ముచ్చటనిది
ధడబడలుమానర ఓనరుడా ॥అజపం అచలం॥

40. ఎందుకు పరస్త్రీజోలి భడవ నీ
తల్లి అక్కవలె జూడుమురా
ముందున్నది యమదండనమూఢా
గోడోయని వాపోయెవురా ॥అజపం అచలం॥

41. జీవునిస్థితి వుత్పత్తిలయము
బోధించిన గురుబ్రహ్మంబనరా
దేవునిమరుగును ఎరిగినమనుజుని
మానవజన్మము సరియనరా ॥అజపం అచలం॥

42. జ్ఞానములేనిది మనుజుడుకాడని
వేదవాక్యమును వినవలెరా
జ్ఞానాజ్ఞాన విమర్శను ఎరుగని
మనుజుడు పశువుతో సమమనెరా ॥అజపం అచలం॥

43. జ్ఞానముయున నీతెలివిలో తెలివిర
తెలియుట నెవ్వారితరమగురా
మానము లెనిమిది విడచియు జ్ఞానము
నిజగురుకరుణచె గనవలెరా ॥అజపం అచలం॥

44. జ్ఞానమునీనా నెందునతెలసిన
గోప్యమైన రాహస్యమురా
వ్యానాపానవుధ్యాననమానము
లన్నిటిమింగిన అచలమురా ॥అజపం అచలం॥

45. ద్వైతాద్వైత విశిష్టాద్వైతా
వేదాంతంబన యేమిటిర
మాతాపితా పరమాత్మా
గురుడేయని గురినిల్పుటెవినరా ॥అపజం అచలం॥

46. సీతారాములు వాయువుసుతునకు
బోధించిన భజనసుగనరా
ప్రీతితోశబరికి దెలపిన భజనను
గనశుభమగురా ఓనరుడా ॥అజపం అచలం॥

47. పుడమిలో ఖాదర్ మస్తాన్ గురుదయ
మనకిదిచాలును సజ్జనుడా
బోడపాటిలో గురుమందిర
మున భజనసుగనరా ఓనరుడా ॥అజపం అచలం॥

శంకరాభరణరాగం కీర్తన చతురశ్రజాతి త్రిపుట తాళం.

1. సర్వేశ నీకృప నాపై । యుర్వీస్థళంబున దయచై
యుర్వీస్థళంబున దయచై । పరమందునిలుచును స్థిరమై॥
2. కరిరాజు రక్షక కనుల । ధరచూడు మొరవిని మనల
ధరచూడు మొరవిని మనల।మరువాము హరహరఅచల॥సర్వే॥
3. పరితాపములచేమమనసు । పరమేశ నిలవదు నిలుపు
పరమేశ నిలవదు నిలుపు । పరితాపముల భువి అణచు॥సర్వే॥
4. అరుదైన నీముద్దుమోము । కరుణించు చూచెదాము
కరుణించు చూచెదాము । స్మరియించి నినువిడువాము॥సర్వే॥
5. అరవింద వదనగావ । పరమాన సుతులను బ్రోవ
పరమాన సుతులను బ్రోవ । అరలేక శ్రీహరిరావ॥సర్వే॥

6. ఘోరంబు మనపాపంబు । హరియించు పరిపాలింపు
హరియించు పరిపాలింపు ! ధర్మంబు నిజన్యాయంబు ॥సర్వే॥
7. దశా అవతారముల ప్రియ । దశరాధ రాజతనయ
దశరాధ రాజతనయ । పసివారి మరచుటనరియ॥సర్వే॥
8. జగదీశ గోపబాల । జగమందు నీదెలీల
జగమందు నీదెలీల । జాగేల చూడ వేల॥సర్వేశ॥
9. జన్మంబు యీజగమందు । మనకొద్దు వలదికముందు
మనకొద్దు వలదికముందు । మన్నించు దైవమయిందు॥సర్వే॥
10. బలభద్ర యీ అబలాల । బాలూల మొరవినవేల
బాలూల మొరవినవేల । పాలించు దీనదయాళ॥సర్వేశ॥
11. ధరబోడపాటిరమణ । గురుఖాదరార్యుని కరుణ
గురుఖాదరార్యునికరుణ । ఘోరపాపములు సంహరణ ॥సర్వేశ॥

ఝంఝూటిరాగం త్రిశ్రజాతి రూపకం.

కీర్తన.

1. సుజనులార భజనచేయ అజపమొందుడి
గజిబిజిబడనేల జన్మరహిత మొందుడి ॥సుజను॥
2. సరిపడదని సరసములను దూరమాడుడి
హరికృప మనకవసరమని గురునిజేరుడి ॥ సుజను ॥
3. జననమరణములను ఎన్నొ ఎత్తియుండెడి
ఘనులు దెలియపరచినారు ఆలకించుడి ॥ సుజను ॥
4. కామక్రోధలోభములను కాల్చివేయుడి
క్రమముగమన దురితగుణము లణచివేయుడి ॥ సుజను ॥
5. పుడమిలోన బోడపాటి మఠమునందుడి
తడబడకను ఖాదరుగురుని గాంచనడవుడి ॥ సుజను ॥

కీర్తన. జుల్వాతాళము.

1. హరిగురు స్మరణచేయ పరుగుబారవాకె జీవ
పరమపావన గురునిజేర బిరాబిరారావె జీవ ॥ హరి ॥

2. గురుదేవారుడు గరుడగమనుడనుచు ఎరుగు మరిగి జీవ
హరిహరాది సురులు మునులు, గురుని గలసి చనిరె జీవ ॥హరి॥

* 3. స్థిరాస్థిరములను దెలియలేని ఏటిజన్మ జీవ
శరణుశరణు గురువరేణ్యుడనుచు త్వరలోరావె జీవ ॥ హరి ॥

4. ఘోరపాపహరణ గర్వరహితగురుడెయనుచు జీవ
దరినిజేర లేని హీన బ్రతుకు ఏటి బ్రతుకు జీవ ॥ హరి ॥

5. ధరను గుంటూరు బోడపాటి ఖాదరుమస్తాను జీవ
ఆధరించు తండ్రివనుచు మరువక ధ్యానించె జీవ ॥ హరి ॥

## కీర్తన.

1. రామునిగానాని పామారనరులూ
రామరామన లేరమీాగు సోమరులూ ॥ రా ॥

2. రామశ్రీరామాని కొట్టారెచేతులూ
రామానిపలకారె నోయ్యంగనోరులూ ॥ రా ॥

3. ఏమారక నిత్యచేయరె పూజలూ
కామితార్థమునిచ్చి కరుణించురాములు ॥ రా ॥

4. ఏమీాటికిమీాకు కామక్రోధములు
ఏమిలేనిమీారు మాయబొమ్మాలు ॥ రా ॥

5. ఇమ్మాహి బోడాపాటందున ఖాదరు
స్వాములు దెలిపిన సమ్మాత రాములు॥రా॥

## ర్తన.

1. చీమలు దోమలు ఈగలు నల్లులు చీకటి ఎండ ప్రపంచమిది
కామక్రోధము లోభ మోహా మదమత్సరముల ప్రాపంచమిది.

2. కాకులు గద్దలు కోళ్ళు పిచ్చికలు కొంగలుండు ప్రాపంచమిది
మేకలు గొఱ్ఱెలు గాడిద గుఱ్ఱము బఱ్ఱెలుండు ప్రాపంచమిది.

3. జలగలు పాములు చేపలుకప్పలు బాతులు పురుగు ప్రపంచమిది
నలికిరి బల్లులు తొండలు ఉడతలు తేళ్ళు ముండ్ల ప్రాపంచ
మిది॥చీమలు॥

4. పులులు సింహములు ఏనుగు లొంటెలు చిరుతలు ఎలుగు ప్రాపంచమిది
ఎలుకలు పిల్లులు పశువులు కోతులు కుక్క నక్క ప్రాపంచ మిది॥చీమలు॥

5. కనకము కాంతలు ఆలులు పిల్లలు తమ్ములు అన్న ప్రాపంచ మిది
జననము తినడము పేరగడం పెరగడం దినదిన మరణ ప్రా పంచమిది॥చీమలు॥

6. సంవత్సరము నెలలు వారములు రోజులు గల ప్రాపంచమిది
గంటలు ఘడియలు నిమిషము అర నిమిషంబులుండు ప్రాపంచ మిది॥చీమలు॥

7. నరులుండరు హరి శ్రీహరిసాక్షిగ మరులు బాపె ప్రాపంచమిది
మరిగి వృక్షము యీాద లేరు సరి మగవారిను ప్రాపంచమిది ॥చీమలు॥

8. ఎరిగి గురు హుశేన్ దాసు పరమప్రియకొమరుని దెలిపె ప్రాపంచమిది
ఎరిగి ఎరుకతొ పరమున కేగిరి సరికాదని ప్రాపంచమిది ॥చీమ॥

## కీర్తన.

1. మాయలోకమిది మాయ శరీరము । మాయలోబడక యుం డరయా । ఖాయము లేనిది నీచ దేహమిది చేయదగినపని చేయం డయా॥మాయ॥

2. మిద్దెలు మేడలు జగతినంతయు అద్దె చందమున యెంచరయా అధిపతి నెరుగక ఆటలాడెదరు ॥సాధుల జేరిన తెలుసునయా॥

3. మతభేదంబులు లేవని యిలలో మతి జపమందున యుంచ రయా । సతతము సద్గురు పాదమునమ్మితె పాతము కర్మలను జేయునయా॥మాయ॥

6. ఎరుకమూలమును ఎరుగని గురువులమార్గము ఛీఛీ వలదుగదా। కరుణగలిగి గురు హనుశేటి బ్రంహ్మల ఖాదరుకృప మనకాయె గదా ॥ ఎరుకె ॥

రీతిగౌళ రాగం. చతురశ్రజాతి—ఏకతాళం.

ఆనంద భైరవి—కీర్తన.

1. ఎరుకె జీవుడు శివరాయభవా । ఎరుకానులోన ఎరుకె తానాను ఓంభవా । ఎరుకె నీవును నేనును సర్వంఎరుక నిల్వానాలో పూర్ణం, ఎరుకె జగమంతటనిండ, ఎరుకె తానె నెరుకను గా

2. ఎరుకెసృష్టిస్థితిలయములకు । ఎంచి ఎరుగనటుండిఅన్నిటికి తాళి । పరిపూర్ణముగ ఎరుకనె నెరుగను యిహాప రమను పలికిన ఎరుకె

3. ఎరుకె పరిపూర్ణంబనుచును పలికె । పలుకులో పలుకై నిలచె నిత్యంబై పూర్ణంబెరుకే హరిహరాదిసురమునులు ఋషులు దృఢనిశ్చయ మెరుకని నిశ్చయము జెందిన ఎరుకే

4. ఎరుకేపరమార్థం బదినిమరుగు। గురువర్యుల పదములమరిగి తత్క్షణమె పరుగిడి ఎరుగు ఎరుకపూర్ణమిది ఎరుకమరుపులకు ఎరుకె ఏకద్వితీయంబైనది ఎరుకే

5. ధరలోగుంటూరు జిల్లాకరుగు। మరునాటి త్రోవలోవేరు గ్రామంబు బోడపాడు । తనుణాను దొరికెదు పరుగులు బడెగురు ఖాదరు బ్రహ్మను ఎరిగిన మొగుగవు ఎరుకే

కీర్తన.

1. సర్వేశుడిదుగో చూడరమ్మా। హరిహర బ్రహ్మలు సన్నిధిజేర గురునికొల్వారమ్మా। ఎరుకామగుపూలవాడు। స్థిర మైన పరిపూర్ణుడు సుగులా వ్యాపియగు నిలచిన కదలని మెదలని అచలస్వరూపుడు ॥సర్వే॥

2. ఆధారము లేనివాడోయమ్మా। ఆదిఅనాదికి ఏకరూపుడై యున్నాడమ్మా। నాదూబిందూలకళల ఆదిమూలమై వెలసె। వేదావేత్తలు ముదమున వదలక పదిలముజేసిన బ్రంహ్మము ॥ సర్వే ॥

3. అంధూలై వదలాబోకురమ్మా। ఇందుముఖి పలిగన మందమతి బొందబోకురమ్మా। కందూవరేకుల పైమందాహాసముజేసె।సుందారాంగునిగూడి। అందమలలరగ పొందునుచేయుచు ॥సర్వే

4. నరకా స్వర్గములయమానమ్మా॥ నారాయణుని గనపరుగూలెలను మొరవినరమ్మా వైరివారలై మీరుకోరి నిజగురుచెంత జేరలేకను పరిపరివిధముల పరిమని కలవర పడుచును ॥సర్వే॥

5. తడవు చేయాబోకు ఓయమ్మా । తడబడి ఖాదరుగురు బోడపాటిలో జూడరమ్మా। మూడులోకము నేలెజోడులేనట్టి వాని నేడూవేడుకమీరసరగున తెలిపిన సరసిజనేత్రుడు ॥సర్వే॥

## పాట.

1. మేలాయెలె చాల మేలాయెలె । మళ్లి జన్మ
మనకు యిలలెదాయెలె॥మేలాయె॥

2. తల్లి తండ్రి దైవమంత గురుడాయెలె
అల్లనాడు యమబాధ లేవాయెలె॥మేలాయె॥

3. కలిమాయ కలగానె కల్లాయెలె
ముల్లోకముల వాడు మనకాయెలె.

4. అల్లిబిల్లి పిల్లలాట తేటాయెలె
గోలగోల జగములెల్ల గోలాయెలె

5. పిల్ల పేరంటములు బొమ్మలాటయెలె
కల్ల వస్తువులు ఎల్ల లేవాయెలే.

6. ఉల్లమందు ఖాదరు మన్నాక మరువాములె
చల్లగ మమ్మేల నీకు కోరినాములె॥

## తత్వము.

రామయని నేనెట్లు పలుకుదు పరమాత్మ అల్లాకుదా రామయని
రూపునామములు లేక ఏకమై ఇహ పరమంతజ్యోతిగాక యున్న
బ్రహ్మ నీవె నీవె నూ.
లోక లోకములు నేలె యేకరూపుడావు నీవు
ఏమని బలుకుదు నిన్ను కృష్ణ రామ అల్లా కుదా ॥ రామ ॥
మింటికి మంటికి నంటి వంటిగా అంతట నిండి
పండి పండై యుండునట్టఖండ తేజూడా
ఎండలు వానలు వెన్నెలందు యందుజూచినాను
దండిగాయుండి యుండక యున్న సున్నాశంభోశంకర
॥రామ॥నే॥
నేనె నీవు నీవె నేను సర్వము నీవెను నీవు నీకు అన్యయేమి
లేదు నిశ్చయంబుగా, నాకు నీకు భేదమెంచు బోధలన్ని బాధ
గల్పు, వేదాతీత యేమనందు లేదు రూపు పేరునీకు రామ॥నే॥
గాలిలో గాలియు నీవు అగ్నిలో అగ్నియు నీవు ఆపలోఆపయు
పృథ్వ్యలందు ఓషధుల్, సర్వసారములో సారవంతము నీవెను
నీవు నీవుగావు తిరగ నీవు నీకు వున్న పేరు జూపు॥ రామ॥నే॥
ధారుణి హస్సెను గురుడుండ జూడ అండపిండా బ్రహ్మాండ భాండ
ములన్ని నిండి యావల. ఖండా ఖండముల లేకదండి ఖాద
రార్యుడు, జూడజూడ జాడలేక నీడలో నిగ్గైనవాడ ॥రా॥॥నే॥

## కీర్తన

1. మస్తానయ్యా మస్తానయ్యా। మన । మస్తానయ్యా మస్తానయ్యా॥
మస్తానయ్యానీవు । రస్తా ప్రక్కనయుండి ॥
బస్తీకర్మములన్ని । వస్తానెరోలినావా । మ ।

2. రేపూమాపనకుండ ! దూపాములందూచు ॥
కాపాడెకరామా । దాపునయున్నావా ॥ మ ॥

3. మోక్షాపేక్షుల । దీక్షాల మెచ్చుచూ ॥
సాక్షీస్వరూపుడై । రక్షించుచున్నావా ॥ మ ॥

4. సంతూలులేనీవా । రెంతో దూరమునుంచి ॥
చెంత జేరికోర । సంతూలిప్పించెవా ॥ మ ॥

5. దేశప్రకాశనీవాస్యనాహృద్కమల ॥
దాసూడనై వేడ । గాసి రక్షించవా ॥ మ ॥

6. ఆశపాశాములన్ని కోసివేసినీవు । కేసీఘోరాతపసు జేసీకూడా
వైతీవా ॥మ॥

7. ప్రతినిత్యానీసేవా । ద్వితియాముజావారు ।
మతినిల్పి సేయ స । దతిదెల్పి బ్రోవవా ॥ మ॥

(శ్రీహారతి)

హారతి గై కోనుమీా । జయహారాతి గై కోనుమీా । శుభహారా
తీ గై కోనుమీా॥
ఓబవ్ వేలిపురవాస । ఖాదారు రుషిచంద హారాతీ గై
కోనుమీా ॥హా॥
తల్లిగర్భమునుంచి । జన్మించినట్టుండి । అల్లాను పెంచితివి ।
పెళ్లిప్యారంటం లేకుంటివి । మళ్లీ జన్మకు రానంటివి
అల్ల అనందమైనట్టి । అఖండమూర్తివి ॥హా॥జ॥సు॥హా॥
అవనిలో గురుదేవ । ఆది అంత్యాము దెలసి । అంటీ అంటక
యుంటీవి । ఇలో యుండె వెల్లగంటివి అంధైక్యామునీవై తీవి
మా అజ్ఞానము ద్రుంచె । యాధారాధీరాయా॥హా॥జ॥సు॥
షేఖు హుశేణ్ పాద । సేవాజేసి పరమ రహాస్యముగంటివి ।
అరణ్యాశము జేరితివి । పన్నెండ్ వర్షాము లచటుంటివి । ఆహా
నిర్వాణముగురు పూజ మర్మాకుల జేసెగురు॥హా॥జ॥సు॥
దుర్మార్గులు పెదు । మర్మాముగన లేక । తర్మీతర్మీ వేసిరీ । వారు
తర్కాములు జేసిరీ । బహుకష్టాములు బెట్టెరీ.
అట్టి దుర్మార్గులబట్టి । దారీ జూపిన గురుడా॥ హా॥జ॥సు॥

బోడాపాడు గ్రామ । బిడ్డాలకడ జ్ఞాన । బోధనీవు దెల్పితివి।
అచట మఠము గట్టించితివి । మంచి బిరుదు వహించితివి.
ఓ బాధలు దోలీన । పీడారహితజయ।హా।జ।సు॥
వాసిగ గుంటూరు నీ । వాసాముజావరు।మస్తాను బిలిచితిరి
తమకరమూలతో దువ్విరి। అతని సంశయము దీర్చిరిస్వామి॥
ఆశపాశ లేని । నాసారు వంశజుడా॥హా।జ।సు॥

పూజపాట

1. చేయరేపూజ చేయరే । సద్గురుపూజ । చేయరెపూజచేయరే।
కాయమనియెడి ఎరుకలోపల ఎరుకమరుపుల కెరుకతానై
గోప్యమై పరిపూర్ణమైపరమై వెలింగెడిచంద్రయోగుల॥చేయరే॥

2. న్యాయమార్గము బాయకను పరమార్థ మచలముదెలిపి సుజ
నుల దయచె జన్మముదీర్చి బ్రోచిన దేశగురు శ్రీ నాసరార్యుల
॥చేయరేపూజచే॥

3. బాయకను గురుచరణములు మదిద్వాదశాక్షరి మరువకెప్పుడు
స్మరణచేయుచు సద్విచారము ప్రజలకొసగిన శ్రీహుస్సేనుగురు
॥చేయరే॥

4. మాయరూపము మాయమని । అయమాత్మ బ్రహ్మముతాను
తానని । కాయమును కడద్రోచి నిలచిన స్వామి శ్రీ గురు
ఖాదరార్యుల ॥చేయరే॥

5. దివ్యమగు గురుపీఠమును సుగంధద్రవ్యము లమరబూసి । స్థిర
ముగా ధర బోడపాటి పరమభక్తులు స్వామిపూజ ॥చేయరే॥

మంగళహారతి

1. గురుమూర్తి మంగళారతి । పరిపూర్ణ నీకుహారతి
పరమాదయానిధి । అర్జునుని రథసారథి
మురహర మంగళారతి । శ్రీహరిగైకొను హారతి ॥గురు॥

2. కరుణా ఋషిపోషణ ! పరిహరించు మన దుర్గుణ
దురితదూర సురరక్షణ । హారతీదో ఘనమునిగణ ॥గురు॥

3. సృష్టిస్థితిలయకారణ । అష్టదళములభూషణ ।
ఇష్టలింగమణిఅంగణ । నిష్టహారతీదో సుగుణ ।

4. కృష్ణాఖగవాహన । విష్ణుమూర్తినినుదలచిన !
శిష్టులగాచి రక్షించిన । కృష్ణరాహారతి గైకొన ॥ గురు ॥

5. శరణాగురునాధ నా । మొరవిను పరిపాలన
ధరలోబోడపాటి సుజన । హారతిదో జనలోలన ॥ గురు ॥

ఖాదర్ మొహిదీన్ షాఖాద్రి,

బట్వాల్.

హాల్ బోడపాటునందువున్న మఠమందిరం,

పొన్నూరుపోస్టు, గుంటూరుజిల్లా.



